య్యలారా !

ఈగ్రంథమును వ్రాయుటకు నాకిదియే ప్రథమప్రయత్నంబైయున్నది. నేను శాస్త్రాది విద్యలనభ్యసించలేదు. సకలాంతర్యామియగునీశ్వరునిభక్తియే ముఖ్యమగు త్రికరణాభిప్రాయమగుటచేతను భక్తవరులకు పఠనీయంబగుటచేతను తద్విషయమును నామిత్రులగుబుధవరులు, లోకంబునవ్యాప్తిచేయవలెనని పలుభంగులప్రోత్సాహింప, నీగ్రంథమునువ్రాసితినిగాన, క్షీరనీరన్యాయానుసారంబుగ నిందలి దోషంబుల విడనాడి తప్పులమన్నింపవేడెద.

ఇట్లు విన్నవించువిధేయుడు
గ్రంథకర్త.

శ్రీ రామచంద్ర గురు పరబ్రహ్మణే నమః

# శ్రీ వాసుదేవశతకము.

---

౧ శ్రీ జగన్నాథ పరమేశ చిద్విలాస
భక్తమందార మురవైరి భానుతేజ
శిష్టరక్షక దుష్టులఁజీల్చునాడ
దీనజనవర్తి శ్రీ వాసుదేవమూర్తి.

౨ శతకమొక్కటి నీకు నంకితముఁజేయ
దలచి శ్రీ వాసుదేవశతక మనంగఁ
బెద్దలయభిమతముఁబట్టి పేరనిడితి ॥దీ॥

౩ భక్తియే ముఖ్యమైన భావంబుగాన
గణయతిప్రాసముఖ్య లక్షణములందు
దోషమున్నను ద్రోయ బుధులనుగోలుతు ॥దీ॥

౪ ధరణిలో బాధలన్నియు దఱుమివేయఁ
దగజనించిన వసుదేవతనయ కృష్ణ
బాలక్రీడలు వేవేల బరగినట్టి ॥దీ॥

౫ భానువాసరమున నీవు పరమపురుష
యష్టమీతిథియందు నింపమరు రోహి
ణీయనునక్షత్రమున బుట్టినయనమాన ॥దీ॥

౬ నందనందన గోపాల మందహాస
సుందరాకారనామోదఁ సందియంబు
లేదు, ననుబ్రోచి కరుణించు వేదవేద్య ॥దీ॥

# వాసుదేవశతకము.

౭ నీచుశకటాసురుని ద్రుంచి నిగడువాఁడ
సత్యమున సూర్య చంద్రుల బనుపువాఁడ
కుపితపూతనప్రాణముల్ గొన్నవాఁడ ॥దీ॥

౮ అటవిగాఁచియు ఫణిరాజయమున నరసి
రోసనుండి విషంబుచే హానిసేయ
ధీర! పడిగెలద్రొక్కి మర్దింపలేదె ॥దీ॥

౯ పుండరీకాక్షగోవింద పూర్ణచంద్ర
అండజావాహనగోవింద శౌరిముకుంద
నిండుకారుణ్యమున బ్రోచు నీరజాక్ష ॥దీ॥

౧౦ పసుల పాలన మొనరింప పటిమగల్గి
భూసురులను గోసురులను భూజనులను
రక్షణము సేయు నీలాంగ రమ్యరూప ॥దీ॥

౧౧ ముద్దులొలుకంగ గజ్జెలు మొరసి కాళ్ల
ఘల్లుఘల్లున నాట్యంబు గంటికింపు
గా నొనర్చెడి జగదీశ కంజనేత్ర ॥దీ॥

౧౨ మున్ను నీబాల్యమందున ముదముతోడ
మ్రాకులను సిద్ధులను జేసి మనిచినట్టి
పాపసంహార శ్రీకృష్ణ పరమపురుష ॥దీ॥

౧౩ ధర్మపురుషుల బాధింప ధరణిఁబుట్టి
నట్టి యసురవ్రజంబు నీకడ్డముగ ను
దఁరొనంగఁ జంపిన దేవదురితదూర ॥దీ॥

౧౪ నయవిరహితుఁ గంసుని జంపి జయముపొంది
తల్లిదండ్రుల ప్రియముఁ బొందంగ నుగ్ర
సేనుని నయముగా రాజుఁ జేసినటి ॥దీ॥

## వాసుదేవ శతకము.

౧౫ కృష్ణ గోవర్ధనగిరిని కేఁచుచూచి
నిందుమదమున వ్రేలిపైనిల్పలేదె
చిరుతనంబున యసురులఁజీల్పలేదె ॥దీ॥

౧౬ బిడ్డవైయుండునప్పుడు ప్రియజననికి
గోప! నీవిశ్వరూపంబుఁజూపలేద
నంతస్వాంతైనచర్యలన్ నల్పలేవ ॥దీ॥

౧౭ గోకులంబునఁ బుట్టినగోపబాల
వ్యాకులత్వముఁ బాపెదవ్యాసపూజ్య
గోపికానాథ సురవర గుణఘనుండ ॥దీ॥

౧౮ మున్నుకురురాజు మగ్బుద్ధిమూలమున
పాండవాంగన ద్రౌపదిన్ నిండుకొలువు
నందుమానభంగము సేయ నడ్డుపడిన॥ దీ॥

౧౯ అంతనీవామెమొరలనునాలకించి
నంతనంబున కురురాజు స్వాత్రిశయము
నణచినట్టి రాధాపతీ యాదిదేవ॥

౨౦ పాండుకురులకుగల్గినభండనమున
పాండుపక్షమునందున భాతితోడ
కురునాశనముజేసి చెలఁగినట్టి॥

౨౧ కమలగర్భుఁడుగోగోపగణములన్ని
మాయజేయ నయ్యయిరూపులైయఱనిమ
షమున చెలగిన నాగభూషణ సుమిత్ర॥దీ॥

౨౨ కాంతలందరుఁ జీరలుఁగట్టుమీద
జేర్చి యమునలో స్నానముల్ జేయుచుండ
లజ్జవిడపించి కామితలబ్ధినిచ్చు॥దీ॥

# వాసుదేవశతకము.

౨౩ వజ్రికురిపించుబహుశిలావర్షమునకు
కదలు రేపల్లెపై కొండగొడుగుగాగ
విక్రిమోద్ధతింబట్టిన వేదవేద్య॥దీ॥

౨౪ బాలగోపాల శ్రీలోలనీలవర్ణ
పద్మనాభుండ కరిరాజపాల శౌరి
పతితపావన సురవర పంకజాక్ష॥దీ॥

౨౫ సుజనసంరక్షణార్థమై సొంపుమీఱ
సోమకాసురునణచినసుందరాంగ
రాఘవనుదేవపుత్త్రుండ రంగనాథ॥దీ॥

౨౬ ఇందుసుందరవదనంబునందుమిగుల
మందహాసముతోమోదమొందుదేవ
పక్షిరాజవాహన నరపాల తండ్రి॥దీ॥

౨౭ భక్తులనుగాచు శ్రీకరభవ్యచరిత
ముక్తినిచ్చెడుసర్వేశ మురహరుండ
రాజగోపాల శుభకరరమ్యరూప॥దీ॥

౨౮ దశరథేశునిసుతుండవై ధరణిలోన
రామరూపంబుతోడను రావణాసు
రునివధించుసీతాపతీ రుద్రమిత్త్ర॥దీ॥

౨౯ సురలుపక్షమునందున సుస్థిరముగ
జేరిరక్షించు వామన శేషశయన
మోక్షదాయకదయజూపుపక్షివాహ॥దీ॥

౩౦ పాలకడలిని ఫణిరాజుపాన్పుమీద
బవ్వళించినసుకుమార పరమపురుష
ఆదిలక్ష్మితోసుఖమొందునంబుజాక్ష॥దీ॥

## వాసుదేవశతకము.

౩౯ నీదుమహిమను సర్వదా నేస్తుతింతు
పట్టరాని ముదముతోడ భజన సేయు
నాఁకిందోడు రావె నృపాలపూజ్య ॥దీ॥

౪౦ గరుడగమన యధోక్షజ కమలనేత్ర
సర్వమును నీవె యని నేను నిర్వహింతు
శాంతగుణభూష వ్యాసుభావ సాధుపోష ॥దీ॥

౪౧ మానిహృద్వాస, సువిశాల, మందహాస
మమతదీర్చనమాధవ విమలగాత్ర
విదితశౌర్యాండధైర్యాస్త్ర విబుధవరుఁడ ॥దీ॥

౪౨ జాతిభేదంబు నీకు, లేశమును లేదు
బీదసాదల విభజన లేదు నీకు
అంతయును సమానము నీకు నార్తరక్ష ॥దీ॥

౪౩ పాండురంగపురమునందు నిండి వెలసి
పరమభాగవతోత్తమ భజన వడసి
గాచి బ్రోచిన సర్వేశ కరివరదుఁడ ॥దీ॥

౪౪ సభలు చేసెడి చోట నీస్తవము మెండు
వైభవము వెల్గు చోట నీ శోభ మెండు
క్షీరసాగరశయన మురాఁశౌరి ॥దీ॥

౪౫ తపసునియందు నీవె ప్రతాపదీప
హాస్తియందున నీవె మహాత్మ దేవ
సర్వమును నీవె జగదీశ సరసిజాక్ష ॥దీ॥

౪౬ తోటలును దొడ్లు సస్యముల్ దురితదూర
బాగు చేయుచుఁ గాపాడు భాగధేయ
వర్షధారలు గురిపించు పరమపురుష ॥దీ॥

# వాసుదేవశతకము.

౪౭ తొట్రుపాటుననుమున్నప్పుమూరుచుందు
రెంతపాపమువచ్చునోసుంతయైన
నేరికప్పుడు తెలియుదోయీశ్వరేశ ॥దీ॥

౪౮ శివప్రతిష్ఠనుసల్పినసిద్ధసాధ్య
కవివరులఁబోషణముచేయు కలుషగహిత
మాటిమాటికినీశక్తి చాటువాఁడ ॥దీ॥

౪౯ వరద! వేంకటరమణమూర్తి రఘువంశ్య
జానకీరామ సుందరమానవేశ
నాదుకోర్కెనుదీర్చవ నళిననేత్ర ॥దీ॥

౫౦ భానురూపంబుననుపేంద్ర భాసురముగ
జ్యోతియొంతయు జగమునజూపువాఁడ
విజయరామ మనీషపవిత్రచరిత ॥దీ॥

౫౧ తాటకినిమర్దనముజేసి ధరణిలోన
వెలసి యసురులజంపంగ విష్ణుదేవ
కుసుమవర్షముగురిసెను వసుమతీశ ॥దీ॥

౫౨ నాల్గువేదంబులనుబట్టి నీల్గుసోమ
కాసురునిజంపిదెచ్చిన దానపోమ
సర్వలోకంబులేలెడి సదయహృదయ ॥దీ॥

౫౩ రామరూపంబుదాల్చి వరంబులిచ్చి
వేడుకొన్నట్టిబుధులకు వేడ్కదీర్చి
యీప్సితార్థసిద్ధినిజేయు నినకులుండ ॥దీ॥

౫౪ చిఱుతనంబున చంద్రునిజేతఁబట్టు
టకును బంతెంబుఁబట్టితుట్టతుదకు ఘన
మైనయుద్ధంబులోఁజూచి యాదుకొన్న ॥దీ॥

౫౫ శూరనిను భర్తగాఁగోరు శూర్పణఖను
నీదుసోదరుచేతను నవముబెట్టి
గట్టిశిక్షవిధించిన ఘనుఁడవీవ ॥దీ॥

౫౬ చండశాసనప్రబల కోదండరామ ॥దీ॥
అంతయింతయు నెంతయోనంతమైన
గానరానట్టి యఖిలేశకన్నతండ్రి ॥దీ॥

౫౭ నీవెతండ్రివి నీయింతినిఖిలమాత
నీవెసర్వంబు జగదీశ నీరజాక్ష
బాలశశిధరమిత్ర సద్భవ్యగాత్ర ॥దీ॥

౫౮ రణమునందున నీదుశూరత్వమహిమ
సాటిలేదనివినియుంటి సర్వసాక్షి
యాదిమూర్తివియని గొనియాడుచుంటి ॥దీ॥

౫౯ వినుతిగైకొనుజానకీ విభుఁడ రామ
యాదినారాయణుండగు వేదవేద్య
గరుడగమనుండ నీలాంగకోమలనయన ॥దీ॥

౬౦ భువినహల్యనుబ్రోచిన పుణ్యపురుష
పాండురంగమహానుభావ యనిరుద్ధ
గోపికానాథ మోహనకోమలాంగ ॥దీ॥

౬౧ పట్టణంబువిపణి చెట్టుగుట్టమొదలు
వస్తువులసృజియించిన వసుమతీశ
నిర్వికారుండనిర్గుణ నిరుపమాన ॥దీ॥

౬౨ ప్రబలదండకవని త్రోవపట్టినావు
పట్టిదుష్టరాక్షసులనుగొట్టినావు
గొట్టిమునులకు మోదము జేకూర్చినావు ॥దీ॥

## వాసుదేవశతకము.

౬౩ పర్వతశిఖరములమీద భక్తితోడ
దపము జేసెడిమునులకు దనివిదీర
కామితార్థములిచ్చిన రామకృష్ణ ॥దే॥

౬౪ స్వర్గలోకంబటన్నను సాధుపోష
నీదులోకంబుకోరకయి నెమ్మినమ్మి
చుంటిగావున దానినిజూపరావ ॥దే॥

౬౫ బ్రాహ్మణక్షత్రియులు వైశ్యపాదజులను
నాల్గుజాతులు కానియనాథులైన
వారిగూడనినువేడ వరములిడిన ॥దే॥

౬౬ జాతిమతభేదరహితుఁడ జానకీశ
కరుణమూర్తి భవించిన కరణిధరణి
దివ్యరూపంబుదాల్చిన దేవదేవ ॥దే॥

౬౭ హాహిరణ్యాక్షుఁడన్న యసురవరుండు
భూమినంతయుఁజుట్టఁగ బుధులమొరల
విని వరాహాంబవై వాని దునిమినట్టి ॥దే॥

౬౮ చింతలనుబాపు శ్రీకర చిద్విలాస
శేషశయనుండ విశ్వేశ శీలవంత
భద్రగుణధామ శ్రీరామ భవ్యనామ ॥దే॥

౬౯ భవ్యకరిరాజుమకరిచే బాధనొంద
కరిమొరలువిని వానిని గాచిబ్రోచి
యాపదుద్ధారకుఁడవైన రూపవంత ॥దే॥

౭౦ అన్నియవతారములునీవె యవుటవలన
వివిధనామావళులతోడ వేడుచుంటి
నీదుభక్తుండననుబ్రోవుమాదిదేవ ॥దే॥

౨౧ పుణ్యధామంబు భద్రాద్రిపురమునందు
వెలసినట్టి శ్రీజానకీవిభుఁడఘనుఁడ
నీచుమారీచుజంపిన నీలవర్ణ ॥దీ॥

౨౨ చిత్తమందుననినుసదాసేవజేసి
దినదినంబునువేడంగ దీనపోష
కరుణతోననుబ్రోవుము కరివరదుఁడ ॥దీ॥

౨౩ సాంద్రమగు మూఢవార్ధినుండి సాధుమార్గ
మును నిరూపించు మురహరి ముక్తిదాయ
కుండవని వేడదొడగితిపాండురంగ ॥దీ॥

౨౪ వేంకటేశుఁడవీవె కవీంద్రుఁడవు ర
మేశవైకుంఠనాథ లక్ష్మివనాథ
విద్యయనుభూషణముచేత వెలయువాఁడ ॥దీ॥

౨౫ నీదుకరుణనుగొనుటకు నిండుభక్తి
తోయనేకులు యాత్రలుజేయుచుందు
రట్టివారలగాపాడు నార్తరక్ష ॥దీ॥

౨౬ పరశురాముని గర్వంబు భంగపఱచి
సమరవిజయంబుగాంచుచు సంతతమును
సకలహితకరవర్తనజరపుశౌరి ॥దీ॥

౨౭ వాయుదేవునివలెనీవు వసుధలోన
వర్షధారలతోగల్పి ప్రళయముగను
యుల్లకల్లోలములుసేయు నమరనాథ ॥దీ॥

౨౮ అగ్నిదేవునివలె బడబాగ్నివలెన
యర్ణవంబుననీశక్తి యక్కజముగ
జూపుచుండెడి క్షితినాథగోపబాల ॥దీ॥

# వాసుదేవశతకము.

౭౫ అధమరాజులవధియింప రథముసెక్కి
పారధివలెను దత్పార్థసహితముగను
కదనమునకేగి కౌరవవధనలిపిన ॥దీ॥

౭౬ రామశరశింహవామన రామరామ
కృష్ణగోవింద కేశవ కృష్ణకృష్ణ
విష్ణుశశివర్ణ శ్రీకరవిష్ణు విష్ణు ॥దీ॥

౭౭ నగమువాహినినరసులు నాకసంబు
యర్ణవంబు విభావరియహముమొదలు
గాగలవియన్నిరూపించు కమలనాభ ॥దీ॥

౭౮ పుణ్యపాపములను మస్త పుణ్యవరుల
చిన్నపెద్దలసాధుల బ్రీతితోడ
సృష్టిజేయుచునరులకు నిష్టమిచ్చు ॥దీ॥

౭౯ రాహువనువాడు సుధకయిరాజనముగ
సురలపంక్తికికూర్చుండ సుస్థిరముగ
భానుసోములుసూచింప వానిజంపు ॥దీ॥

౮౦ అష్టదిక్పాలకులునిన్ను ననవరతము
స్మరణజేయుచుందురుగాన సమరవిజయ
మెంతనీదివ్యమహిమంబు యిందిరేశ ॥దీ॥

౮౧ పక్షిరాడ్వాహనుండగు భానుతేజ
శిక్షకర్తలగు జనులనుజెల్చువాడ
మునిజనువినుత నిత్యంబునినుభజింతు ॥దీ॥

౮౨ పార్థసారథిగోరిరి బ్రాపునాదు
పాపముల పారదోలెను పతితపావ
నుండ సంస్తో(త్రపాత్ర) వినోదగాత్ర ॥దీ॥

౮౭ భద్రగిరినిలయుఁడవై సుభద్రకోర్కె
దీర్పఁబట్టి జగన్నాథధీయుతుండ
నీదుసోదరులతోఁగూడి నెగడువాఁడ ॥దీ॥

౮౮ కలవుజలరాశియందున గాలియందు
కలవుగగనంబునందున వలుదశిలను
కలవుకుంభినియందున గాలమందు ॥దీ॥

౮౯ నీవె బలసోదరుండవు నీవెయీశ
పుత్రుఁడవు నీవె దేవకీపుత్రుఁడీవె
సద్గుణాఢ్య మురాసురసంహారుండ ॥దీ॥

౯౦ నీవె సర్వవ్యాపుండవు నీరజాక్ష
నీవె శ్రీ మహాదేవతాధిపుఁడవు
నీవె సర్వేశ్వరుండవు గావదేవ ॥దీ॥

౯౧ ఆదిమధ్యాంతరహిత యానందభరిత
కరుణగలపితృణంబులు గాంచుచెపుడు
జగమునంతయుఁ బాలించు జలజనభ ॥దీ॥

౯౨ అర్కనాశేశ్వరుండగు హరునిమిత్ర
గోపదేవిసుతుఁడవౌ దేవదేవ
పాండుపుత్రులఁ గాచిన భవ్యచరిత ॥దీ॥

౯౩ వివిధంబులు వేషముల్ వేయువాఁడ
ఘనవిహారాదరూపంబున బుట్టినట్టి
పరమపావనశరీర నిరుపమాన ॥దీ॥

౯౪ క్షేమ ప్రేమంతులైనట్టి సేవకులను
విలసితకారుణ్యమునఁ బ్రోచు విశ్వరూప
పద్మలోచన శ్రీకృష్ణభక్తవరద ॥దీ॥

# వాసుదేవశతకము

౯౫ నీదుభువనంబు మేలగు నీదుమహిమ
నీనివాసము నీనిజమైనరూప
మెటులనుండునొ జూపవే యిందిరేశ ॥దీ॥

౯౬ భక్తిమార్గంబుజూపెడి పరమపురుష
భాగ్యభోగ్యాదులిచ్చు నారోగ్యకరుఁడ
సత్యముగుజీవనంబిచ్చు సమరవిజయ ॥దీ॥

౯౭ రాజభక్తి నిప్పొచ్చించి రాజామరుల
దీవనలజేసివారిని దొల్లముఁగను
వృద్ధిజేయుటమాకొర యుద్ధవిజయ ॥దీ॥

౯౮ భువిని నేలెడు రేనినంపూర్ణకరుణ
నాయురారోగ్యములనిచ్చి హాయినిచ్చి
యుల్లసిల్లఁగఁగాచి వర్థిల్లజేయు ॥దీ॥

౯౯ జయసురేంద్ర సుగుణసాంద్ర జయనరేంద్ర
జయసునేత్ర కులపవిత్ర జయసుగాత్ర
జయహృషీకేశధరణీశ జయరమేశ ॥దీ॥
మంగళముతమ్మ పూభాగ్యకృష్ణ సదహా
మంగళము పాపరహిత శ్రీరంగరంగ ॥దీ॥

౧౦౦ పృథివిఁగన్నూలకులజుండ వేంకయాఖ్య
పౌత్రుఁడను గృష్ణానంద సుపుత్రవరుఁడ
రామనూంబికాగర్భసంప్రభవుఁడనిదె ॥దీ॥

౧౦౧ చతురతరవిద్యలేమియుఁజదువలేదు
క్షితిని పెదరామయాఖ్యుఁడ శతకమాల
గూర్చియర్పించితిని గయికొనుము దయను ॥దీ॥

శ్రీవాసుదేవశతకము సంపూర్ణం

